DHARMA DEEPIKA
(Collection of Editorials of 'Saptagiri')
Written by K Subba Rao

Edited by
M Rama Krishna Sastry

Year of Publication 1994

Religious Publication Series No 448

Cover Designed by
Jagadish
Chandrasekhar

Copies 1,000

Published by
Sri D V L N Murthy, I A S,
Executive Officer,
T T Devasthanams,
Tirupati

Printed at
T T Devasthanams Press,
Tirupati - 517 507

# ముందుమాట

సప్తగిరి పత్రికకు, కాట్రపాటి సుబ్బారావుకు వున్న అనుబంధం ఈనాటిది కాదు. గత పాతిక సంవత్సరాలుగా సప్తగిరికి సారథ్యం, సంపాదకత్వం వహిస్తున్నది ఆయనే అంతేకాదు అంతకుముందు తిరుమల, తిరుపతి దేవస్థానముల జర్నల్‌గా పత్రిక వెలువడుతున్నప్పుడు కూడ దాని బాగోగులు చూసుకున్న వారు వారే శ్రీవారి దర్శనానికై వచ్చే యాత్రిక బృందానికి, దేవస్థానముల పరిపాలనారంగానికి మధ్య వారధిలా పనిచేస్తూ, ప్రతినెలా పత్రికలో సంపాదకీయాలు వ్రాశారు అందులో ఆ యా సందర్భాంకు తగ్గట్టుగా, ఆయా నెలసరి ఆలోచనా సరళిని ప్రతిబింబించేవిగా ఎక్కువ రచనలు ఉన్నా కొన్ని మాత్రం సార్వజనీనమై, సాహితీ గంధంతో నిండినవి మరికొన్ని సార్వకాలికమైనవి. ఆ రచనలు ఆలోచనలు రేకెత్తించే కొత్తదనంతో మౌలిక జీవన విధానాలను అన్వేషింపజేసేవిగా ఉన్నాయి ఈ తరహా రచనలను పుస్తక రూపంలో- 'ధర్మదీపికలు' అనే పేరుతో ఇక్కడ సంగ్రహించటమైనది

ఆర్షవిజ్ఞానంలో పరిణతులైన శ్రీసుబ్బారావు ఆధునిక మనస్తత్త్వం కలిగిన వ్యక్తి సనాతనధర్మం, సంస్కృతి, సాహిత్యం, ఏకేశ్వరవాదం, సంఘజీవనం మొదలైన అంశాలపై దూరదృష్టితో, సహానుభూతితో వారు మథనం జరిపి, కొన్ని నిత్యసత్యాలను ప్రస్ఫుటంగా చెప్పటం జరిగింది తిరుమల, తిరుపతి దేవస్థానం ఇతర ప్రచురణలలాగే పాఠకులు దీనిని ఆదరిస్తారని విశ్వసిస్తాము

22-6-94,
తిరుపతి

డి.వి.ఎల్.ఎన్.మూర్తి,
కార్యనిర్వహణాధికారి,
తి తి దేవస్థానములు

# నివేదన

సప్తగిరి సంపాదకులు కాటపాటి సుబ్బారావుగారు తెలుగు పాఠక లోకానికి పాతికేళ్లనుండి పరిచితులు. సప్తగిరి పత్రిక ఆంధ్రదేశంలోనే కాక మరి నాలుగు భాషా ప్రాంతాలలో జనజీవన సరళిలో మిళితమై, నెల నెలా ఎదురుచూచి చదివే వాతావరణాన్ని నిర్మించారు. ఆయన వ్రాసిన కొన్ని సంపాదకీయాలను ఒక పుస్తక రూపంలో ఇవ్వడం ఇక్కడ జరిగింది. ఈ సంపుటానికి రచనలను ఎన్నుకునేటప్పుడు కాలసూచక ప్రమాద దోషం లేనివాటిని, పునరుక్తులు లేనివాటిని మాత్రమే ఎన్నుకోవటమైనది. ఐనా అక్కడక్కడ పునరుక్తులు దొర్లివుంటే అవి విషయావగాహనకు సహకరించేవిగా ఉంటాయి.

ఈ పుస్తక ప్రచురణకు తోడ్పడ్డవారు సప్తగిరి ఉపసంపాదకులు బి.ఎన్. శ్రీనివాసన్, రీసెర్చ్ అసిస్టెంటు కోరాడ రామకృష్ణ, సంపాదకులు ఎల్లోరా, తదితరులు, అతి తక్కువ వ్యవధిలో ముద్రించిన తి.తి. దేవస్థానం ప్రెస్ సిబ్బందికి కృతజ్ఞతలు.

తిరుపతి

22-6-94

ములుకుట్ల రామకృష్ణశాస్త్రి
తి.తి.దే. ప్రచురణ విభాగాధికారి.

# తొలిపలుకు

మనిషన్న వాడికి ఒక మదింపు కావాలి అంటే వ్యక్తిగతమైన గుణాలు ఆధారంగా ఒక గుర్తింపు తను ఆశించిన స్థాయికన్న ఏ మాత్రం తేడా వచ్చినా మనస్సు బాణం తగిలిన లేడిలా విలవిల్లాడిపోతుంది. ఈ గుర్తింపులో తేడాలవల్లే చరిత్ర పుటలలో మహాయుద్ధాలు చోటుచేసుకున్నాయి అందలా లెక్కిన వారిమంచి అడుగున బడుగుజీవనం గడిపేవాళ్ళదాకా ఈ మదింపు మత్తుకు దాసులే మహాకవులు మత్తులు కాకపోయినా, దీనివల్ల ప్రేరణ పొంది మంచి కావ్యాలను ప్రసాదించారు ఇంట్లో ఈగల మోతలున్న కవులుకూడా వెలుపలి పల్లకీమోతలకు పరవశులు కాక తప్పలేదు. కనుకనే ఇంట్లో ఈగలబాధ ఇలానే ఉంటుందనుకుని, బైట పరువు పల్లకీ నెక్కాలని ప్రాకులాడటంలో వింతేంలేదు

నేను ప్రవృత్తి రీత్యా కవిని కాను, రచయితనని చెప్పటంకాని, ఒప్పు కోవటంకాని కష్టం ఏదో ఉద్యోగానికి ముందు నాలుగో ఐదో పాటలు, ఉద్యోగంలో నెలకొకసారి పరీక్షల సమాధానాల మాదిరి, చిరుగిలుకులు తప్ప సాధించిందేమి లేదని ధీమాన్యుల బాధలు ఈ సామాన్యుడికి ఉండవని సంతోషిస్తుండేవాడిని

కాని ధీమాన్యుల బాధ నాకూ అంటుకున్నట్లుంది అందుకే -- నీ రాతల మీద మదింపు హక్కు నీది కాదు మాదీ అని సహోద్యోగులూ, సహోద్యోగులూ ఒక పేజీ రాత కావాలంటే కాదన లేకపోయాను కాద నటానికి నేనెవరిని? ముప్పయి సంవత్సరాలు కొండమీది స్వామి సేవలో కొలువున్న నాకు నాదంటూ ఒకటి ఉంటే కదా! ఆ స్వామిని అందరు అక్షరాలైనవాటి తోటి, లక్షలతోటి అర్చిస్తుంటే అంత ఓపికలేని నేను ఈ నెలసరి అక్షర మందారమాలతో ఆ స్వామిని అర్చించాననుకొన్నాను

"నీ పాదాలకు నే చేసిన పూజలివి
పూ(చి నీ కిరీటరూప పుష్పము లివియయ్యా"

అనుకుంటే సరిపోతుంది.

ఈ సంపాదకీయ మందారమాలకు ప్రేరకులు, కూర్పరులు నా సహోద్యోగులు, శ్రీ. ఎన్.ఎస్.రామమూర్తి, బి.ఎన్.శ్రీనివాసన్, సహోద్యోగి

సహచరులు, రచయిత, రంగప్రయోక్త, నటుడు శ్రీ టి.ఎల్.సుబ్బారావు,--

అందరూ రాస్తున్నారు అని అనుకోకుండా అమితమైన ఆదరణతో ఈ గ్రంథ ముద్రణకు ఆదేశించిన నిపుణుల సంఘ మండలి అధ్యక్షుడు శ్రీ ఎ.చెంగల్ రెడ్డిగారు, కార్యనిర్వహణాధికారి శ్రీ డి.వి.ఎల్.ఎన్.మూర్తి,--

అనతి కాలంలో కొత్త మెరుపులు చూపేటట్లు ముద్రించగలమని నిరూపించిన మేనేజరు శ్రీమోహన్‌రావు,--

నా అధికారపరిధి ఆచరణకు ఆవరణగా నిల్చి అవకాశమున్నంతవరకు ఆప్యాయతతో సహకార మందించిన శ్రీయుతులు శ్రీ ఎం.రామకృష్ణశాస్త్రి, శ్రీ ఎల్లోరా, శ్రీ డి.నాగసిద్దారెడ్డి.--

ఇలా వీరందరికీ కాక ఇంకెందరికో నా కృతజ్ఞతాభివందనాలు అర్పిం చవలసి వుంది.

ఈ పాతిక పరువాల పరుగు జీవితంలో 'ఈ రచయితకు' తెలిసేటట్లు తెలియకుండా ఎందరు సహకారాలను అందించారో అందరూ.....

అందుకోండి నా వందనాలు
కురిపించండి మీ ఆశీస్సుల చందనాలు

కాటపాటి సుబ్బారావు

సంపాదకుడు - సప్తగిరి

# విషయ సూచిక

# 1. గణపతి

ప్రపంచంలో ఎవరికైన గౌరవం ఎందువల్ల లభిస్తున్నది? ఆ వ్యక్తి సమాజంలో మిగిలిన వారికన్న గుణంలోనో, ధనంలోనో, అధికారంలోనో, విద్యలోనో ఆధిక్యత సంపాదించటంవల్ల అని స్థూలంగా చెప్పుకోవల్సివుంది. ఒక్కొక్కప్పుడు అందరికన్న అందగాడని ఆదరణ లభించవచ్చు ఈ పెరిగ ణవం వల్ల ఆ వ్యక్తికి ఒక స్థాయి దానివలన కొంత తృప్తి లభిస్తుంది. ఆతని కార్య సాధనలో ఈ వైశిష్ట్యం అనుయాయులను సమకూర్చి కొంతవరకు ఆత్మ ప్రత్యయాన్ని కల్గిస్తుంది నేను, నావి అనే ఆకర్షణ కలిగించి, విశ్వాసంతో ముందుకు పోయేందుకు తోడ్పడుతుంది దీన్ని మనం ఆత్మవిశ్వాసం అంటున్నాం. ఇది పూర్తిగా లోపిస్తే ప్రపంచపు అస్తిత్వానికే ప్రమాదం కనుక ఇది అవసరమే!

కాని మనస్సు మరీ పాపిష్ఠిది. ఇది ఇక్కడితో ఆగనీయదు. గోరంత విజయానికి కొండంత గౌరవ భ్రాంతి కల్పిస్తుంది. ఇక రూపం కూడా తోడైతే పాపం పెరిగినట్లే! నా ఎదుటి వాళ్ళందరూ నాపలనీ, నేనే వీరుణ్ణనీ ఆలమందలో ఆబోతు మాదిరి రంకెలు వేస్తూ ఎదుటివాడు ఎంత గొప్పవాడైనా, గోటికి కూడా తగడన్నట్లు అపహాస్యం, అవహేళన చేస్తాడు. నిజానికి ఎదురుదెబ్బ తగిలితే ఎవరితో చెప్పుకోవాలో తెలియని అర్భకుడు. అంతటి పిరికి మరొకడుండడు ఇదంతా 'నేను' చేసే మాయాలీల! మనసులోని ఆ తెర తొలిగితే గాని 'నేను' వ్యాధి నయంకాదు; వినయం రాదు. ఈ పైత్యమంతా ప్రకోపించబట్టే, కంఠేకాల జటామకుటమణిననీ, తారాధిపతి ననీ, ఓషధీశ్వరుడనన్ని, ఆదిపురుష హృదయాధిజాతుడననీ గర్వించిన శీతకిరణుడు విఘ్నేశ్వరుని చూచి హేళన చేయుటం, వినాయ కుడు శపిస్తే మళ్ళీ ఆ విఘ్నరాజునే శరణు వేడటం జరిగింది. నిజానికి బలిచక్రవర్తి కూడ దాతననే గర్వంతో ఏది అడిగినా ఇస్తాననటం, వామన త్రివిక్రమాటోపానికి తట్టుకొలేక శరణు వేడటం జరిగింది ఆ వినాయకుడు గాని ఈ వామనుడు గాని సురూపులు కాకపోవటం గమనార్హం.

బహిరార్భాట మత్తులై నశ్వరమైన దాని భ్రాంతిలో అవహేళన చేయటం దోషమని బాహిర ప్రకృతిని భిన్నమైన శాశ్వతమైన ఆత్మ సౌందర్యం ప్రతి జీవిలోను నిక్షిప్తమై వుందని దాన్ని గ్రహించి మెలగాలని పై రెండు కథల సారాంశం సుందర దేవతా కోటిలో ఈ విరూపేశ్వరుడు రూపొందటానికి చెప్పిన కారణాలేవైనా సమాజానికి చక్కని సందేశం మాత్రం వుంది.

నాయకత్వానికి కావలసింది, స్ఫురద్రూపం మాత్రమే కాదు. నిశ్చలత, కార్యదీక్ష, సూక్ష్మదృష్టి, విషయపరిజ్ఞానం. ఇవన్నీ ఆంతరికాలే! మన పురాణ సాహిత్యంలో, వినాయకునికి సంబంధించిన ఏ కథలోనూ ఆయనకు తడబాటు కాని ఆవేశం కాని ఉన్నట్లు కనిపించదు. స్ఫురద్రూపి, దేవసేనా వల్లభుడైన షణ్ముఖుడు మయూరవాహనుడై బయల్దేరగా సూక్ష్మదర్శి అన వినాయకుడు జననీజనకులకు ప్రదక్షిణించి తగిన ఫలాన్ని ముందుగానే పొందాడు పై లక్షణాలతో పాటు సమయజ్ఞత నాయకత్వానికి కలికితురాయి అహంకార రహితంగా ఈ బుద్ధులు సంతరించుకున్నవారికి సిద్ధి కరతలామలకం దీనికి సంకేతంగానే బహుశః వినాయకునికి సిద్ధి, బుద్ధి భార్యలని వుండవచ్చు.

మిగిలిన వారి మీదకన్నా వైకల్య వైరూప్యాలున్న సంతానం మీదనే తల్లిదండ్రులకు మక్కువ ఎక్కువని కూడా వినాయకుని గణాధిపత్యపు కథ నిరూపిస్తున్నది త్వరగా కదలలేని బిడ్డడనే మమకారంతో లోక జననీజనకులు ధర్మసూక్ష్మంతోపాటు పదవిని కూడా ఇప్పించారు.

అసలు గజాస్యం, మూషక వాహనం ఆ దేవుని సమరస భావానికి నిదర్శనం అని కూడా అనుకోవచ్చు. అతి పెద్ద ప్రాణిని తలగా, అతి చిన్న జీవిని వాహనంగా రూపొందించుకోవటం దేవుని సర్వజీవ సమభావాన్ని సర్వాంతర్యామిత్వాన్ని నిరూపిస్తాయి ఏ రూపంలో వున్నా భగవంతుడొక్కడే కదా! పైగా ఈ గజమూషకాలు రెండు సహజ శత్రువులు కావటంవల్ల వాటిని కైవసం చేసుకొన్న దేవుడు నిజంగా క్షేత్రపాలుడే కదా!

ఇన్ని విశేషాలున్నదేవుడు గణనాథుడు కావటంలో ఇంతటి బుద్ధిజీవి విఘ్ననాయకుడు కావటంలో ఆశ్చర్యం లేదు పాన బెట్టని వ్రతానికి రాణింపు లేదనే అంటారు దేవుని విఘ్నాలు మానవ సాధనకు పరీక్షలు విఘ్నాన్ని ఊహించుకుని తట్టుకునే శక్తిలేని కలిజనులం కనుక విఘ్నాలే కలిగించవద్దని వేడుకుంటున్నాం. వేమన్నానని వస్తే భరించలేం గనుక నీ వున్నావని మనమే పిలిచి పండుగ చేసి ఇక అడ్డం రావొద్దని మొక్కుకుంటున్నాం చాలా వ్రతాల క్రతువుల సందర్భంలో నా సాయం కావాలా అని ఒకాయన అడిగితే అడ్డం రాకుంటే అదే చాలని సమాధానం వచ్చిందట ఇదీ అంతే ననిపిస్తుంది బాహ్యదృష్టిలో

"గణానాం త్వా గణపతిం హవామహే!
కవిం కవీనా ముపశ్రవస్తమమ్,
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పతి
రాన్నశ్శృణ్వన్నూతిభి స్సీదసాదనమ్."

* * *

# 2. వేదవాఙ్మయం

వేదాలు అంటే చాలు మొదట ప్రారంభమయ్యేది అవి పౌరుషేయాలా అపౌరుషేయాలా అన్న వాదాలు ఇవి చాలా పరుషంగా పౌరుషవంతంగా ప్రారంభమై వక్తల తార్కిక ప్రతిభకు, తరతరాల వైషమ్యాలకు తార్కాణా లౌతున్నవే తప్ప సత్యావిష్కరణకు సాధనాలు కావటం లేదు. ఎవరన్నా మధ్యేమార్గంగా సమన్వయం చేస్తే వేదాలపై ఈ వాదాలు చల్లబడ్తాయేమో

'విద్' ధాతువుకు తెలియు, జ్ఞానము అన్న అర్థాలున్నాయి ఈ జ్ఞానం సత్యమని, అనంతమని, బ్రహ్మమని అన్నారు అఖిల చరాచర

సృష్టిలో ప్రతిదీ ఒక నిర్ణీత పరిధిలోనే నడుస్తున్నదే తప్ప, కొన్ని వేల ఏళ్ళ గతిలో వ్యత్యస్తమైన దాఖలాలు లేవు. ఈ సర్వ నియామకశక్తిని తెలిపేది, తెలిపే శక్తిగంది నిజమైన జ్ఞానం. అదే వేదం. ఆ జ్ఞానానికి ఆవిర్భావకరూపం నాదం. అందువల్ల వేదాలు విశ్వవిరాట్ విశ్వాసాలని అన్నారు. సృష్టి నిర్మాణ వైచిత్రిలో తీవ్రజిజ్ఞాసగల కొందరు ఒక్కొక్క అంశంపైన మనస్సును, తమ అనుభవాలను కేంద్రీకరించి తపించి మధించగా, వారికి అతీంద్రియ జ్ఞానం, ప్రకృతి మూలరూపం-తదంశలు, వివిధ పరిణామాలు-ఈ విధంగా చేతనా చేతన వస్తుజాలాన్ని గూర్చి గోచరించగా వాటిని తమ అంతేవాసులకు, అనుయాయులకు వివరించారు. ఇలా అగమ్యంగా, అగోచరంగా ఉన్న జ్ఞానాన్ని దర్శించి చెప్పగల్గినవారు కనుక వారిని ద్రష్టలన్నారు. సత్యావిష్కరణకు వాగ్రూపమే సాధనమైంది గనుక, ఆ స్వరం ఉదాత్తానుదాత్తాది భేదాలలో ఉండి లిపిముఖ ప్రకటనంలో అసాధ్యం గనుక, ఆ పరమపురుషుని విశ్వాస స్వరూపమైన అనంత విజ్ఞానం చతుర్ముఖబ్రహ్మకు గోచరమై స్పష్ట వాగ్రూపం పొంది, ద్రష్టలద్వారా వ్యాఖ్యాతమూ, వ్యాకృతమూనై పరంపరాగతంగా గురుశిష్య సంబంధం, పితృపుత్ర రూపక బాంధవ్యంలో మననాటి వరకు మనగల్గింది.

ఐతే దేహం నశ్వరం, తామరాకు మీది నీటి బుడగలాగా పలువర్ణ రంజితమై ఎప్పుడో ఒకనాడు "టప్" మనేదే. మన మీనాడనుకుంటున్న ఈ మాట వాళ్ళు ఏనాడో గ్రహించి వేసిన విషయం గనుక తమ కనగలమైన విజ్ఞానాన్ని వీలైనంతవరకు లిపిబద్ధం చేసే ప్రయత్నం చేశారు. ఈ ప్రయత్నాలకు ప్రాతిపదిక రూపంగా, మాహేశ్వర సూత్రావిర్భావాన్ని తీసుకోవచ్చు వ్యాకృతమైన భాషాస్వరూపం ఆధారంగా ఉపనిషత్తులు, వివిధ శాస్త్రాలు ఏర్పడి ద్వాపరం నాటికి వాఙ్మయారణ్యం కాగా కాలగతిలో లుప్తమైన వాటిని, చేర్పులను శోధించి కృష్ణద్వైపాయనుడూ పరాశరాత్మజుడైన వ్యాసభగవానుడు, ఈ వేదవాఙ్మయమంతా ఈ యీ భాగాలలో ఈ విధంగా సమీకృతమై ఉన్నది - అని వేదాలను విభజించి తత్సంబద్ధ ఉపనిషదాది

వాఙ్మయావిష్కరణకు మూలపురుషుడయ్యాడు వేదోపనిషద్బృంహితమైన వాఙ్మయసారాన్ని తత్కాలపు భాషలో, నిబద్ధంచేసి, కథారూపకమైన అష్టాదశపురాణాలకుకూడా కారణభూతడయ్యాడు కాలక్రమాన లిపి పరిణతి పొంది, వైజ్ఞానిక విజయమూ తోడై ఆ వేదవాఙ్మయాన్ని క్రమబద్ధంగా గ్రంధాలుగా రూపొందించడమే గాక నాదాన్ని పది కాలాల పాటు పదిలపరచి ముందు తరాలవారి కందించే అవకాశం కూడా ఏర్పడింది.

మరి ఇందరు మహనీయుల నిరంతర కృషివల్ల ఈనాడు మనకు లభించిన మహత్తర వాఙ్మయ మహోదధిని కూడా నిస్సారమైన పౌరుషేయాపౌరుషేయ వాదదావాగ్నితో ఇంకించివేస్తున్నాం సమరసభావాన్ని నశింపజేసి సమరభావాన్ని రెచ్చగొట్టే కన్న ఒకరకంగా వేదాలు పౌరుషేయాలు, అపౌరుషేయాలు అవి తృప్తిపడవచ్చు కూడా. ఈ ప్రకృతిలో శ్రీకృష్ణుడు తప్ప మిగిలినదంతా స్త్రీ స్వరూపమే అని మీరా చెప్పినట్లు పురుష శబ్ద వాచ్యార్థతగల ఏకైక పురుషుని గురించివవి గనుక పౌరుషేయాలు ఆ పరమాత్మచేత గూడా చెప్పబడక, పాంచభౌతిక పురుషరూపులకు కూడా గోచరించినవి మాత్రమే అయినందువల్ల అపౌరుషేయాలు అన్నా తప్పలేదు.

ఇంతకీ 'ధర్మో రక్షతి రక్షితః' అన్నట్లు సార్వకాలిక ధర్మ స్వరూపమైన వేదాన్ని రక్షించి పోషించుకోవటమే మనకర్తవ్యం.

ఇలా అనూచానంగా అనుశ్రుతంగా వచ్చే వేదవాఙ్మయాన్ని, స్వర సహితంగా రక్షించుకోవటానికి గురుకుల సంప్రదాయాలు, ఏ కారణం చేతనైనా స్వాధ్యాయాదులు మరుగునపడే దుఃస్థితి ప్రాప్తిస్తే కనీసం బాహ్య రూపం, వాచ్యార్థంతోనూ సమాజానికి లభించేందుకు లిపి, ముద్రణాలు తోడ్పడ్తున్నవి.

కనుకనే దేవస్థానం, తనకు సంబంధించినంత వరకు ఏ వాదాల జోలికి పోకుండా, వేదవాఙ్మయ పరిరక్షణకు యథాశక్తి తోడ్పడుతున్నది. సస్వర వేదవాఙ్మయ రక్షణకు, ఈ నాటికే కనుమరుగైన వేదశాఖలకు రూపా

లుగా ఉన్నవారినుండి ఆయా భాగాలను టేప్‌రికార్డు చేసే కార్యక్రమాన్ని చేపట్టింది అనుశ్రుతంగా వచ్చే వేదాధ్యయన రక్షణకు, కుమారాధ్యయన పధకాన్ని స్వీకరించి వేదవిధుల సంతతి పాశ్చాత్య విద్యావిమోహితులు కాకుండా వేదరక్షణలోనే తమ ప్రశాంత జీవితాలను గడుపుతూ ఆధ్యాత్మిక జ్ఞానజ్యోతిని దేశం నలుమూలలా వెదజల్లేందుకు తోడ్పడుతున్నది

* * *

# 3. మంత్రాలెందుకు?

మంత్రాలెందుకు అన్నది ప్రశ్న మననుద్ధరించటానికి - అని సమాధానం మననుద్ధరించటమే కాదు, ధరించటానికీ, భరించటానికీ అని వ్యాఖ్యానం. హరించటానికి కూడా - అనే భయంతో కూడిన హెచ్చరిక. మంత్రాలపై సమాజంలోని అభిప్రాయాలు చూస్తే ఇవి నిజమే ననిపిస్తుంది

అసలు మంత్రమంటే ఏమిటి? 'మననాత్ త్రాయతే ఇతి మంత్రః' మననంవల్ల మనల్ని రక్షిస్తుంది కనుక అది మంత్రమైందని విజ్ఞులవాక్కు. దేనినుంచి రక్షిస్తుంది? మానవుడు ఎంత వికసనశీలియైనా, జన్మ జరా మృత్యుభయం అతణ్ణి అనాదిగా వెన్నాడుతూనే వుంది 'జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ' అని గానుగెద్దులాగ జీవుడు ఈ చక్రభ్రమణం చేస్తునే వున్నాడు మంత్రం అనేది మనన శీలంగల జీవి తాత్కాలిక శాశ్వతావస్థాభేదాలను నిరూపించి ఈషణత్రయాన్ని క్రమంగా దూరం చేసి, పునరావృత్తి రహితమైన, త్రికాలాతీత శాశ్వత బ్రహ్మలోకాన్ని పొందేందుకు తోడ్పడుతుంది తాత్కాలిక ప్రయోజనాలుగల అష్టసిద్ధుల లాంటి వాని అనర్థాన్ని సుస్థిరంగా నిరూపించి పరతత్త్వావగాహనకు, తురీయపురుషార్థ ప్రాప్తికి మంత్రాలు మార్గదర్శకాలౌతాయి

మంత్రానుష్ఠానానికి ముందు ఆ మంత్రాధిదేవతను మన ఆత్మత త్త్వంలో ఆవాహనం చేసికొని ముందుకు సాగుతాం దీనివల్ల అనుష్ఠాతకు ఆవధుల కనుగుణంగా కొంత ఉద్దిష్ట ప్రయోజనం సిద్ధిస్తుంది. దేహధర్మాల ననుసరించి ఈ సాధన సాగుతుంది కనుక, అంతవరకు మనలను ధరిస్తాయన్నమాట

కాని ఆదర్శాలెంత గొప్పగా వున్నా సాధించిన విజయాలలో ఒక్కొక్కప్పుడు మనస్సు మదంతో కదనుత్రొక్కి సమాజ మారక కారణమౌతుంది. దైవదత్తమైన మేధాసంపత్తిని మేదోష్టి రక్తసంవృద్ధికీ, సమాజ పీడా కారకంగా దురుపయోగం చేసేవారిని మంత్రాదిదేవతలు తీవ్ర వైకల్యానికి గురిచేసి శిక్షించటం జరుగుతుంది ఈ రీతి ప్రయోగవేత్తలలో ఇది అనుభవంలోని మాట. కనుక ఇలా మంత్రాలు మానవోద్ధరణ, దారణ, భరణ, సంహరణ కార్యక్రమాలు నిర్వహిస్తుంటాయనుకోవచ్చును.

మంత్రద్రష్టలు తమకవగతమైన శక్తిని గూర్చి పరిపూర్ణమైన అనుభవం పొంది తరువాతి తరాలవారికి ఎలా ఆచరించాలో వివరణ పూర్వకంగా అందించారు కాని ఇందులోగల చిక్కులన్నీ గమనించిన పెద్దలు మంత్రశాస్త్రాన్నంతటినీ, సాత్త్విక, రాజస, తామస సార్వా విధాలుగా విభజించి, మానసిక పూజను సాత్త్వికమనీ, అది అందరికీ అందుబాటులో లేనిదిగనుక అర్చామూర్తి పూజ రాజసమనీ, జీవహింస మోహాత్మక ప్రవృత్తులు గల్గిన పూజా విధానం తామసికమని విభజించి, దేహబుద్ధి ధర్మానుగుణంగా ఎవరెవరు ఏ ప్రక్రియ ననుసరించవచ్చునో నిరూపించారు

ఇంకొక స్థూల పరిగణన తీసుకొంటే స్త్రీరూప దేవతారాధనమంతా వామమనీ, పురుష దేవతారాధకమైనవన్నీ దక్షస్థాపితాలు గనుక దక్షిణారాధనలనీ గీటుగీసి తేల్చటమేకాక, వామతామసిక, తామసిక విధానాలన్నిటిని క్షుద్రవిద్యలుగా భావించారు వీటిలో ప్రాపంచిక భోగ్యవస్తువులకుగల ప్రాధాన్యాన్ని చూచిన పెద్దలు పరమ లౌకిక ప్రయోజనాలుగల యీ తామసిక

విద్యలను 'క్షుల్' విద్యలుగా (ఆకలి విద్యలు) నిర్ణయించి వుంటారు అవి కాలక్రమాన నానార్థాలను నామధేయాలను సంతరించుకొన్నవి కనుక నామమంతా తామసికం కాదన్నమాట

అనాదిగా సృష్టి ధర్మాన్ని గూర్చి వస్తూన్న తాత్త్విక భావన కనుగుణంగానే ఈ మంత్ర విభజన కూడా జరిగిందా అనిపిస్తుంది. అనంతనాముడైన ఆ పురుషోత్తముని పురుషతత్త్వ ప్రతీకగాను, సకల జీవజాల హేతుభూతమైన ప్రకృతి నంతటిని స్త్రీరూప దేవతగాను ఆరాధించారన్నమాట

మంత్రశాస్త్రం మరొక సత్యాన్నికూడా చాటుతున్నదేమో! సరస సమరస శోభన సృష్టిలో ఆ జగజ్జననీజనకులు అవిభాజ్య భాగధేయులనేది ఆ సత్యం

శ్రీచండీనవార్ణవ మంత్రద్రష్టలు బ్రహ్మ విష్ణురుద్రులనీ, శ్రీమహాకాళీ, శ్రీమహాలక్ష్మీ మహాసరస్వతులు మంత్రదేవతలనీ, త్రిదేవ్యతీతయైన ఆ మహాశక్తికి మధుకైటభప్రశమని, మధుకైటభఘ్ని, మాహిషోమ్మాలినీ అనే ప్రశస్తులున్నవనీ ఆ మంత్రం చెపుతూంది ఇక శ్రీవిద్యా పరాషోడశాక్షరి పరాదేవతను తార్క్ష్యా రూఢ హరిహృదయ సరోజంలో వెలుగొందే పరమ చిత్స్వరూపిణిగా వర్ణిస్తోంది

పురుషసత్తాక మంత్రాలలో సాత్త్వికమంత్రాలలో కూడా సవితా దేవతా, ఆదిత్యహృదయ రూపీ నారాయణోదేవతా, శనైశ్చరోదేవతా అని స్త్రీలింగ ప్రత్యయాన్ని వాడటం కూడా నూత్నార్థాలను కల్పిస్తున్నది. ఇది ఆదిశంకరులు చెప్పిన 'శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం' అన్నదానికి లక్ష్యభూతంగా వున్నది

అంటే ఈ విశాల చరాచర ప్రకృతి అంతా పరమ పురుష పరాకృతుల లీలాజాలమన్నమాట ఏపేరుతో పిలిచినా, ఆ సుమత్త పరమపురుష హృదయాంతరాళంలో, అనంత చైతన్యం అతిగోప్యంగా వుండి, తత్సంకల్ప మాత్రాన ప్రబుద్ధమై, ప్రకృతి రూపధారిణియై విశాలసృష్టికి కారణభూ

తనౌతున్నదన్నమాట ఒకే సూర్యుడు వస్తుభేదాన్నిబట్టి వివిధాకృతులలో గోచరిస్తున్నట్లుగానే పరమాత్మ ధరించే అవస్థాబేదాల కనుగుణంగా పరాశక్తి కూడా తన రూపాలను ఐశ్వర్య, జ్ఞాన, శక్తి ప్రదాత్రిగా మార్చుకుంటూ విశ్వచాలన కార్యక్రమంలో తన కర్తవ్యాన్ని నిర్వహిస్తూ వుంటుందన్నమాట. మరి ఇది పరమపురుషుడైన వేంకటేశ్వరునకు బ్రహ్మోత్సవంగాను, పరాత్పరియైన అనంతచైతన్య శక్తికి నవరాత్రిమహోత్సవంగాను మనం తరించేందుకేర్పాటైన మహత్తర సమయం.

మానుష మనోమాలిన్యాలను మాని, దైవీసంపదను సాధించుకోవలసిన దీక్షా సమయం. నీది నాదనే నాదాల కతీతంగా తిరుమల శిఖరాం వెలసిన, పుంజీభూత అనంతచైతన్యాన్ని సేవించి, ఆ జ్ఞానగంగలో మును కలిడి, మన కలిదోషాలను కడుగుకొందాం మహేశ్వరధ్యాన తత్పరుడై కృష్ణకథను శ్రీరాముని కంకితం చేసిన పోతనమహాకవి అనుసరించినదికూడా ఈ అఖండ చైతన్యారాధనమే మరి!

> "అమ్మల గన్నయమ్మ ముగురమ్మల మూలపు టమ్మ, చాలబె
> ద్దమ్మ, సురారు లమ్మకడు పాఱడి పుచ్చినయమ్మ దన్నులో
> నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ దుర్గ మా
> యమ్మ, కృపాబ్ధి, యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్."

* * *

# 4. ఏకం సత్

"ఏకం సత్ విప్రా బహుదా వదంతి" - బ్రహ్మపదార్థం ఒక్కటే. పండితులు దాన్ని పలువిధాల వర్ణిస్తుంటారు ఇదీ ఈ ప్రామాణిక వాక్యానికి స్థూలమైన తాత్పర్యం పండితుడైనవాడు బ్రహ్మపదార్థం ఒకటే అని తెలిసి కూడా భిన్నంగా ఎందుకు వ్యాఖ్యానిస్తున్నాడు? అన్న ప్రశ్న

సాధారణ పరిజ్ఞానంకు కలగటం సహజం. విజానికి విశ్వరచనా విలాసం ఈ వాక్యతాత్పర్యాలలోనే ఇమిడి ఉందా అనిపిస్తుంది.

ఏకవస్తువు భిన్నరూప దర్శనానికి కారణం ప్రతిభాసంలో కల అవస్థాభేదం ఒకే సూర్యుడు వస్తువు పారదర్శకతా ఆకార వైవిధ్యాల కారణంగా అదర్శనం నుండి బిన్నరూపదర్శి వరకు బహురూపాలుగా కన్పించినట్లుగానే, నామరూపరహిత విస్తృత చైతన్యంనుండి సంకల్పవికల్పాల కారణంగా భిన్నరూపగుణాన్వితమైన విశాల విశ్వావిర్భావం జరిగింది. ఆ మూలతత్వాన్ని పుంబావనతో పరమాత్మ అనీ, పురుషోత్తముడనీ, ఆ మహాపురుష సంకల్ప సాదన భూతమైన సృజనాత్మక తత్వాన్ని స్త్రీ రూపభావనతో ప్రకృతి అని పేర్కొనటం జరిగింది. అతివ్యామోహక విశ్వనిర్మాణ పాంచబౌతిక శక్తిని మహామాయ అనీ, నారాయణీ అనీ విదులు వివరించారనుకోవచ్చు నారాయణునివలె నారాయణి కూడ అతివైభవ ప్రాబవాత్మకశక్తే అని చెప్పవచ్చు విజానికి దేవీమాహాత్మ్యములో రుద్ర విష్ణ్వభావంవల్ల ఎవరినీ రుద్రహీనుడు, విష్ణుహీనుడు అని అనటంలేదు. కాని శక్తిహీనుడన్నమాట ప్రాణి మాత్ర ప్రపంచంలో దౌర్బల్యసూచకమైంది అని వివరిస్తుంది. ఈ విదంగా చూస్తే సమస్త చరాచర విశ్వరచనా సంవహన సంహరణ కార్యక్రమాలలో రెండే శక్తులు ప్రకృతి పురుషరూపాలు సృష్టి స్థితి లయాత్మకకాలచక్ర సంచలనంలో లక్ష్మీనారాయణులు వాగ్దేవీ బ్రహ్మదేవులు, మహామాయా మహేశ్వరులుగా స్వకర్తవ్య నిర్వహణ బోదను చేస్తున్నారు ఈ లవిబాజ్యతను విరూపించేందుకే విష్ణువు వక్షాన బ్రహ్మవాక్కున, అర్ధేందుదరుని అర్ధదేహంగా శక్తు లమరివున్నారు

మహామాయతీత సర్వసత్తాక ప్రాబవాన్నీ మాయావరణాన్విత బహరూప ప్రపంచాన్నీ నిరీహతో సందర్శించగల్గిన విదులకు ఏకరూ! బ్రహ్మపదార్థమే బహురూపవిస్తృత ప్రపంచముగా గోచరిస్తుంది. ఆ యా వర్గాల కనుగుణంగానే ఆ యా దైవీబావన రూపాలు ఉంటాయి.

అంటే దశరా పేరుతో మనం జరుపుకొనే ఉత్సవాలు సర్వదేవీ రూప- ప్రకృతిమాత ఆరాధనోత్సవాలన్నమాట ఆ మహాశక్తి అవతారాల్లో అతిముఖ్యమైన వాటిని ఈ రూపంగా జ్ఞాపకం చేసుకొని ఆనందిస్తోంది జాతి

ప్రతి కథకూ అర్థం వెనుక సమాజానికందించే పరమార్థం ఒకటి ఉండనే ఉంటుంది. దశరాలో చివరి మూడురోజులు సరస్వతి, దుర్గ, మహాలక్ష్మి పూజ జరుపుతారు. విజయదశమితో దశరా సమాప్తమౌతుంది. దీనికి కూడ విశేషం ఉందనే చెప్పాలి

సమాజవికాసానికి అంగభూతంగా, అంతర్లీనంగా ప్రవహిస్తూ తోడ్పడేది జ్ఞానం 'జ్ఞానవాన్ మాం ప్రపద్యతే' అన్నట్లు సమాజ స్వరూప స్వభావాలను అవగతం చేసుకున్న జ్ఞానికి ధర్మస్వరూప దర్శనం కలుగుతుంది సమబుద్ధితో దుర్గమమైన అవరోధాలను అతిక్రమించి ధర్మబద్ధంగ సంపత్సేవనం జరిగి సమాజాన్ని సంపద్భరితం చేయటం జరుగుతుంది ఆదే లక్ష్మి పూజ

ఇహంలో కూడా వరాన్ని సాధించగలిగిన జితకామికి సాధించలేనివిగాని, సాధించవలసిందిగాని ఏమీ ఉండదు సాత్త్వికారాధన ద్వారా మహామాయా వైకల్య పరీక్షలను అవలీలగా అధిగమించి లౌకిక చరమాంకాన్ని చరితార్థం చేసుకొంటాడు ఆదే జీవిత పరమార్థం- జీవికి విజయదశమి.

అలా కాక అంతా తామే, తమదే అన్నట్లు నడుమంత్రపు జ్ఞానంతో సమాజ సంక్షోభకారులైన మహిష స్వరూపులకు సామాజికమైన ప్రతి వ్యక్తి ఒక శక్తిగా, సాత్త్వికరూపం కూడా సత్త్వరూపమైన చండికగా నిల్చి ఎదుర్కొంటుంది పీడాకారుల మిడిసిపాటుపై నడుమువేటు తప్పదు. అది జాతికొక విజయదశమి.

ఈ సత్యానికి సంకేతంగానే మనం పరాదేవిని బ్రహ్మ, విష్ణు, శివాత్మి కగా ఆరాధిస్తున్నా మేమో! ఆమె అవతారాలు ఆకారాలూ అనంతమైనవి ఆమెను గురించిన భావనలు కూడా అనంతసాగరం. అందులో ఇది ఎన్నోది? ఎంతటిది?

* * *

# 5. ఆది దంపతులు

ఈ విశాల విశ్వమంతా ప్రాకృతికం. అంటే ప్రకృతి సంబంధమైనదన్న మాట. మరి ఇది ఎక్కడి నుంచి ఉద్భవిస్తున్నది అంటే పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుడు పురుషరూపమని, ప్రకృతి స్త్రీ రూపంగాను, బహు మోహకమైన ఈ మాయారూపిణి ఆధారంగా, ఈ విశ్వసృజన కార్యక్రమాన్ని ఆయన రచించాడనీ పురాణాలు చెప్తున్నాయి. పరమ పురుషత్వాన్ని గూర్చి శైవ, వైష్ణవాలు తమ తమ అధిష్ఠాన దైవాలపక్షంగా చెప్తూవుంటే, శాక్తం ఇదంతా తన సంకల్ప మహిమ అని, తన అనుగ్రహబలంవల్లనే త్రిమూర్తులు విశ్వధర్మ నిర్వహణచణు లైనారని అంటున్నది. ఏది ఎలావున్నా సృజన శోభాయమానం కావాలంటే ప్రకృతిరూప మహాశక్తి సంసర్గం చాలా అవ సరం శ్రీమన్నారాయణుడు యోగనిద్రనుండి లేచి, సృష్టి సంకల్పించాడనీ, తత్ఫలితంగా 'హృదయా దధి జాయసే' అన్నట్లుగా నాభికమలంనుండి బ్రహ్మ ఆవిర్భవించారనీ, ఆయన సరస్వతి ఆలంబనంగా వాచిక సంక ల్పంతో నవనవోన్మేషమైన ఈ విశాలవిశ్వాన్ని సృష్టిచేశాడని విన్నాం. గీతలో చెప్పినట్లు క్షేత్రము, బీజము, క్షేత్రజ్ఞుడు తానే అయిన ఆ అఖండ చైతన్యం ఏ నామ రూపాలలోవున్నా వైవిధ్యాన్ని పొంద సంకల్పించినప్పుడు దానికి ఒక మాయావరణం, మనోహరకల్పన ఆలంబనం కాక తప్పదని, అది లేనిదే సృష్టికి పరిపూర్ణత, ప్రగతి వుండదని అనుకోవచ్చు విజానికి మానవ జీవితం కూడా అంతే మనస్సు కమనీయము, జీవితం రమణీయమూ కావాలంటే పురుషాంశమైన నరునికి ప్రకృతిరూపమైన నారి అండగా వుండాలి. అదే జీవితానికి ఇహమూ, పరమూ. శ్రీమన్నారాయణుడు లక్ష్మికి తన వక్షంపై ఆవాసం కల్పించాడన్నా, బ్రహ్మ వాక్పతి అవాడన్నా అర్థం ఇదే. ఈ పరిపూర్ణతను స్ఫురింపజేసేదే పరమేశ్వరుని అర్ధనారీ స్వరూపం. ఈ సమయజగత్తుకు ఆ పరస్పరాశ్లిష్టవపువులే కారణమనటంలో దృష్టి ఇదే.

జ్ఞానమనేది బ్రహ్మస్వరూపం, ఏకరూపం, అఖండ జ్యోతిర్మయం, ఆద్యంతరహితం, త్రికాలాతీతం, అది స్థాణువువలె నిశ్చలం, నిరంజనం.

కాలానికి సరైన కొలమానం లేదంటే కాలాతీత జ్ఞానపు ఆద్యంతాలు తెలుసుకోవాలనుకోవటం అర్థరహితం లింగరూపాన్ని కొలవాలనుకున్న బ్రహ్మ, విష్ణువుల కథ ఈ అంశాన్నే తెలియజేస్తుంది. సాక్షాత్ కాలాతీతుడు, పరంజ్యోతి, శివుడూ తానేకావటంవల్ల ఈ సత్యాన్ని బోధిస్తున్నట్లు, నారాయణుడు తన ప్రయత్నాన్ని విరమించుకోగా, జగత్సృష్టినన్న ఆహం అణగని బ్రహ్మ విఫలయత్నం చేసి ఎలా అవమానం, పూజారాహిత్యం పొందిందీ మనకు తెలుసు. శివతత్త్వం మనకు స్థూలంగా బోధించేది ఇది అఖండ జ్ఞానరూపక బ్రహ్మం మంచి పారమార్థిక విక్షుతుల కారణంగా, రసమయసృష్టి రూపొందింది. ఆ మహాచైతన్యంలో భాగమే ఈ స్థూల సాంసారిక రూపం పూర్ణకాముడైన (ఇంద్రియావధులను గ్రహించి విగ్రహించిన వాడు) మానవుడే పరమేశ్వరునకు ప్రీతిపాత్రుడు

ఇలా ఎన్నో అర్థాలు ఎందరో దేవతల గూర్చి ఆలోచించినకొద్దీ చెప్పుకోవచ్చు అసలు మహర్షుల హృదయం ఒక అగాధ క్షీరసముద్రం. సమస్యా మందరాలను వేసి, ఆలోచనా రజ్జువులతో మధించారేగాని, ఆఖరికి అమృతం పుట్టిక తప్పదు శివరాత్రి మహాపర్వదినాన ఆ ఆదిదంపతులను స్మరించుకు తరిద్దాం!

> నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం
> పరస్పరాశ్లిష్టవపుర్ధరాభ్యామ్,
> నగేంద్ర కన్యా వృషకేతనాభ్యాం
> నమో నమశ్శంకరపార్వతీభ్యామ్.

* * *

# 6. దశావతారం

న మే ద్వేష్యో, న చ ప్రియః, మమ మాయా దురత్యయా, అహం సర్వభూతేషు సంస్థితః -- లాంటి బంగారపు పలుకులు భగవానుని నోటి

నుంచి భగవద్గీతగా వెలువడ్డాయి అంటే భగవానుడు ఎందుకు ఏ పని చేస్తాడో తెలియదు మనం పామరులం, పరిమిత బుద్ధులం కనుక మన లౌకిక ప్రయోజనాలను, సిద్ధాంతాలను ఎంత కష్టపడినా కల్పించని ఆయనకు అంట గడ్తుంటాం మన అభిప్రాయంలో, మన సుఖమే భగవంతుడికి ప్రీతి అని, మన కోసమే ఆయన వైకుంఠంలో చేతులు చాపుకుని ఆహ్వానించేందుకు కూర్చుంటాడనీ అంతేగాని అతి సనాతనమై కూడా నిత్యనూతనంగా భాసించే ప్రతి భగవచ్చర్యపట్ల మూడు రోజుల ముచ్చట జీవితానికి మురిసి మరిచే మానవులు పెంచుకోవలసిన అవగాహన ఎంతో ఎక్కువని గ్రహించడం లేదు. ప్రపంచమంతా నా అంశే అని భగవానుడంటుంటే మనం మన లౌల్యాలు ప్రలోభాలు కారణంగా భగవత్సందేశాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేక మన బలహీన భావాలను ఆ హరికి అంట గడుతున్నాం.

నిజానికి ప్రతి అవతారంలోనూ భగవానుడు జీవతత్త్వంపట్ల జీవలోకం పట్ల తనకున్న గౌరవాన్ని ప్రకటిస్తూనే వున్నాడు

ఆర్యులు 'అనంతా వై అవతారా' అన్నప్పటికీ విభిన్నతకు అస్పదమైనవి పది అవతారాలే ప్రతి అవతారంలోను పరమప్రయోజనం పరహితంగా ప్రకటించాడు

మొదటిది మత్స్యావతారాం పూర్తిగా జలచరం తత్సంబంధం గలది. సమాజహితాన్ని వెదజల్లే విజ్ఞానాన్ని, దుష్టులు, చొరరాని ప్రదేశంలో దాచి నప్పుడు భగవానుడు మహామత్స్య రూపంలో సోమకాసురుణ్ణి సంహరించి వేదోద్ధరణ చేశాడు

రెండవ అవతారం కూర్మావతారం ఇందులో భగవానుడు కూర్మ రూపుడై సమాజ సంపదోద్ధరణం చేశాడు. సమాజానికి పెద్ద ఆపద గలిగి ఆపన్నివారణకు, అన్ని భేదాల కలితంగా సామూహిక ప్రయత్నం జరిగినప్పుడు కేవలం కర్మఫల స్రష్టయైన పరమాత్మ కూడా చూస్తూ వూరు

శిశుండా స్వయంగా బాధను అనుభవిస్తూకూడా తన వంతు కర్తవ్యాన్ని గ్రహిస్తాడు. అందుకే దేవదానవులు మూపున మందర మేసి మధిస్తున్నా హేకూర్మంగా అమృతసిద్ధికి తోడ్పడ్డాడు. (ఇది ఉభయచరం కావటం పునించదగ్గది.)

ఇంక వరాహావతారాన్ని గూర్చి దాన్ని హీనంగా చూసి భగవంతుణ్ణి ,రిహాసుకోవటానికి కూడా మనం జంకటం లేదు. విజానికిది చాల ముఖ్యమైన అవతారం. జలంనుంచి భూమి పుట్టినట్టే జల జలభూయుక్త ,త్స్యానికి విడిగా జీవజాల ఆవిర్భావాన్ని సూచిస్తుంది. జల పరిమాణం, ,మాణం భూమికన్న మిన్నగదా అని నీళ్ళల్లో కలిపి వేయాలని ప్రయత్నం జరిగితే పారమార్థిక శక్తి తనకు తోచిన రూపంలో అవతరించి ప్రతిఘటించి ూమిని ఉద్ధరిస్తుంది

నాల్గవది వారసింహావతారం. ఇది మృగశక్తిలోమంచి వరశక్తి (బుద్ధి) క్తి ఆవిర్భావానికి సంకేతం. 'యే యథా మాం ప్రపద్యంతే తాం ,థా భజామ్యహం' అన్న మాటను తాను ఋజువు చేసుకున్నాడు ,రమాత్మ. హిరణ్యకశిపుడు తనకు కొన్ని సంభవించలేని పరిస్థితులలో, ంటే ఇంటా బయటా, లోపలా వెలుపలా, పగలు, రాత్రి, నేలా, నింగీ వి కావి లేవి తత్త్వాల వల్ల తనకు చావు కావాలని పరబ్రహ్మమండి వరం ాందాడు. వరవరాలలో హరివి ద్వేషిస్తూ ఆ రూపంగా ఆ హరభక్తుడు ారిభక్తుడయ్యాడు. అందుకే భగవానుడు కూడా ఆ కోరిన పరిస్థితులలో ఆహా కసాధ్యమైన రూపాన్ని ధరించి హిరణ్యకశిపుని ముచ్చట కడతేర్చాడు. ంటే ఇక్కడ ఒక బుద్ధి పటిమను మరొక మరింత దృఢమైన యుక్తి ాటవంతో ఎదుర్కోవటం జరిగిందన్నమాట. ఇక్కడ నుండి నరుడి బుద్ధి కాసం ప్రారంభమైందన్నమాట.

ఇక వామనావతారం కేవలం ప్రజ్ఞాప్రాభవ ప్రతిపాదకమైంది. ఇక్కడ -డించగల శత్రువుకన్నా ఓడించిన విధం గొప్పది. రాజ్యాలిస్తానన్న బలి

వదాన్యాహంకారాన్ని మూడడుగులలో అధోలోకాలకు త్రొక్కివేసిన అద్భుత బుద్ధిశాలి అవతారం ఇది. అడిగినదానికి మించి తనకున్నది గదా అని, ఇచ్చేస్తానంటే అది దయాగుణఫలం మాత్రమే గాని, దాని ప్రాధాన్యాన్ని గుర్తించింది కాదు అర్థిని అవమానించటమే అవుతుంది. ఆ తర్వాత అర్థిది పై చేయి అయి దాత తల్లక్రిందుగా పడిపోతాడు మనకుంది గదా పారేద్దాం అన్న అహంకారంతో గాక అర్థి అవసరాన్ని గుర్తించి సానుభూతితో ఇచ్చే దానం కొండంత ప్రయోజనాన్ని కల్గిస్తుందని నిర్దేశించే అవతారం.

తరువాతది భార్గవ రామావతారం మూల కూర్చుంది గదా అని పీదిమీదికి వచ్చి అఘాయిత్యానికి పాలు పడితే పిల్లికూడా పదింతలు పులిగా మారుతుంది. సామాన్య జంతువుకే ఇది వర్తించేటప్పుడు, శస్త్రాస్త్రవిదుడైన ఆ పరశురాముడు ఈ సత్యానికి ప్రతినిధి కావటం ఆశ్చర్యం కాదేమో.

ఇక రామావతారం పరిపూర్ణుడైన మానవుని జీవితం ఎలాంటిది, ఆదర్శ జీవనంకోసం ఎంత క్రమశిక్షణ, ఒడుదుడుకుల నెదుర్కొనే శక్తి కావాలి అన్న విషయంలో రాముడి పాత్రే కాదు, రామాయణంలో ప్రతి పాత్రా ప్రతిబింబమే.

ప్రాణి మరణశీలే ఐనా కోరేది ప్రశాంత జీవితాన్ని అందుకే తనలో వున్న శక్తులను గుప్తంగా ఉంచుకొని వీలైనంతవరకు విలాసవంతంగా గడపటానికి ప్రయత్నిస్తాడు. అయితే కోపం కల్గితేమాత్రం తనంతవాడు తానే ఔతాడు అంతటి ప్రళయశక్తి అది. బలరాముని అవతారం ఈ తత్త్వ ప్రతిరూపం

కాని కొందరి విషయంలో పీడలు పుట్టుకతోనే వెన్ను పట్టుకు వస్తాయి. తన ప్రతిఅడుగుకు ముందు భయంకర ఉత్పాతం మీదికి వస్తున్నట్లనిపిస్తుంది అలాంటప్పుడు కలలు కావాలనుకోవటం కూడా నేరే అవుతుంది. ఈ విశ్వసంఘర్షణలో అనుభవపూర్వకమైన విజ్ఞానం సంపాదించుకున్న మనిషి మనీషిగా తాను తప్పుకుంటూ ఎంతటి భయోత్పా

తాప్నైనా చిరునవ్వుతో చూడటం నేర్చుకుంటాడు రామావతారం ఎందుకు బ్రతకాలి అన్న ఆదర్శజీవనాన్ని చూపిస్తే, కృష్ణావతారం తన చేతికి మట్టంటుకోకుండా ఎలా బ్రతకాలన్న తంత్రవిజ్ఞానాన్ని ప్రబోధిస్తున్నది

సమాజంలోని అకృత్యాలకు ఆధారం ఏదో తన తనన స్ఫురణలకు తగిలినప్పుడు ఆ సత్యాన్ని బోధ చేయడానికి బుద్ధిమంతుడు ప్రయత్ని స్తాడు కాని అనంతకాలానికి సంబంధించిన సమస్యలు కూడా అనంతంగా సాగుతుంటాయి. దాని నిరోధ ప్రయత్నమూ అచంచలంగా సాగుతునే ఉంటుంది. ఈ అవతారం ఒక వ్యక్తికే గాక, ఆ వ్యక్తి ధర్మజిజ్ఞాసకు ప్రతీక. ఈ సత్యాన్వేషకులందరు బుద్ధావతారులే

ఇవికాక అవతార ప్రయోజనం నిర్ధారణం లేదు కనుక, అవకాశం కలియుగాంతం వరకు ఉంది మనకు కల్క్యవతారం అందేది ఎప్పుడో.

ఇన్ని విశేషాలకు మూలమైన ఆ చతుర్భుజ తత్త్వం అన్ని వేషాలకు భిన్నమైంది, అతి సౌమ్యమైంది. దౌష్ట్యం చావటానికి కూడా శక్తిలేని దుర్బలుల పాలపడింది కనుక పరమాత్మ కూడా నారాయణ ప్రతిరూపంగా స్వామివుష్కరిణీ తీరాన అవతరించి బాణాల తూట్లు కాకుండా, సమస్యల సూదిపోట్లతో మనుష్యుల్ని మంచి మార్గాన్ని మళ్ళించాలని ప్రయత్నిస్తూ అందరూ దేవుళ్లమా ఆ బాటన నడిపిస్తున్నాడు

* * *

# 7. శ్రీరాముడు

అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ, . . . యది వా రావణ స్స్వయమ్.

ఆపన్నుడైనవాడు తన శాత్రవుడైన రావణుడైనా సరే అభయమిస్తావ న్నది రాఘవరాముని నీతి.

'అభయం సర్వభూతేభ్యః' అన్నది ఆ జాతి నీతి. అందువల్లనే ఈ దేశం అనాదిగా వివిధ సంస్కృతుల ప్రజల ఉనికికి ఆలవాలమై పోషిస్తూ వచ్చింది. కండబలం ఆధారంగా దండయాత్రలు జరిపిన వారికి ఎదురుగా నిలచి మనలను నిలిపి జాతిశక్తిని నిరూపించుకొన్నదే తప్ప సాధారణ స్థితిలో అందరికీ అభయం ఇచ్చి నిల్చుకొన్నది. అందువల్లనే ఈ భారత జాతీయతా చైతన్యస్రవంతిలో వివిధసంస్కృతులు అంతర్వాహినులై భారతజాతిగా రూపొందాయి. భిన్నత్వంలో ఒక ఐక్యత ఈ జాతి విశిష్టతగా నిరూపించాయి.

కాని ఈ జాతి సమైక్య భావాన్ని పరంపరానుగత ప్రాప్తం చేయటానికి, ఎందరు మహనీయులు ఎన్ని విధాల శ్రమించి, ఎన్నెన్ని త్యాగాలు చేసి, ఆ వాహినికి తీరభూములయ్యారో, అవసరమాత్రాధ్యయన శీలురమైన మన తరగతం కాదు మనకు తెలిసిందల్లా ఇది మనమే సాధించామని, పాపంతా ఒక రోత అనీ.

దీనికి కేవలం బోధన ద్వారా కాక, ఆచరణ ద్వారా సహిత సుస్థిత సమాజ స్థాపనకు మూలస్తంభాలైన మహనీయులు భగవాన్ రాముడు, భగవద్రామానుజులా అంటే ఆశ్చర్యం లేదు అతిశయోక్తి కాదు.

మనిషి మనిషిలోని మనిషిని గుర్తించి గౌరవించగలగటం వల్లనే గొప్పతనం ఉంది కాని అన్నలు అంతరాల వల్ల కాదు.

శ్రీరాముని తండ్రి దేవతలంతే సహాయపడ్డవాడు ఇక శ్రీరాముడు దేవ సమూహాలకైన రాక్షసులను ముక్కుపచ్చలారని పసితనంలోనే ముప్పుతిప్పలు పెట్టి పీకుడు కాని రాచరికపు అహంకారం కన్న ఆత్మీయతపైనే అతనికి అభిమానం ఎక్కువ. బోయరాజు గుహుడు, వానరుడు సుగ్రీవుడు, రాక్షస వంశంలోని విభీషణుడు, వీరందరూ వారి వారి సామాజిక స్థాయిలలో నిమిత్తం లేకుండా రాముడి ప్రీతి పాత్రులయ్యారు. అందర్నీ రాముడు ప్రాతృభావంతో ఆదరించాడు చివరకు శబరి ఇచ్చిన పళ్ళు కూడా

స్వీకరించాడు. ఇక్కడ శబరి సామాజిక స్థితికన్న ఆత్మీయతే రామున్ని ఆకర్షించింది ఇవన్నీ ఒక ఎత్తు. రావణుని పట్ల రాముని ప్రవర్తన ఒక ఎత్తు. తన భార్య నపహరించిన వ్యక్తిని కూడా, శరణు అంటే క్షమించగల ఔదార్యం రామచంద్రుడిది. పశ్చాత్తాపం, క్షమాభావాలతో నరుడు నారాయణుడికి దగ్గరౌతాడని, ఇవి లౌకిక నిబంధనల కతీతాలని రాముడు నడిచి నిరూపించిన సత్యం

కాని అల్పులం దుర్బలులమైన మనం అవన్నీ అవతార పురుషులకే తప్ప మనకు కాదమకుని దైవీగుణాలలో చేర్చేశాం. పూజలతో తృప్తి పడుతున్నాం.

ఆ తర్వాత కాలంలో ఎందరో మహనీయులు జాతి సమైక్యతకు భిన్నత్వంలో ఏకత్వం సాధించటానికి ఎన్నో విధాల ప్రయత్నించినా అగ్రతాంబూలం రామానుజులవారికే చెల్లాలి.

స్థిరసంకల్పం, దృఢదీక్షతో సమాజాన్ని సంస్కరించాలని భగవద్రామానుజులు కూరిమితో శ్రమించారు. శ్రీరాముని మాదిరిగా లోకానికి ఆదర్శప్రాయు లయ్యారు. వింటే పీనం పోయ్యాలనే వింత రోజులలో అతి గోప్యంగా వుంటున్న తిరుమంత్రాన్ని గోపురాగ్రం నుంచి బహుళో పయుక్తంగా ప్రచారం చేయుటం దళితజనులపట్ల వారికిగల అనురక్తికి సాక్ష్యం. వర్ణంకన్న గుణమే మిన్న యని వారు భావించారు. అసలు భాగవత సేవకు వర్ణవిభేదాలు ఎంత ప్రతిబంధకమో గుర్తించటమే, వారి తురీయాశ్రమ స్వీకారానికి త్రోవ చూపిందని విజ్ఞులంటారు. మనకు బాగా తెలిసిందీ, కర్ణాటక ప్రపన్నామృతంలో కన్పించే బీబీనాంచారి కథ దైవిక సంపత్సమీకరణకు వర్గ వర్ణాది భేదం లేదనీ యధాయోగ్యంగా అందరూ తరించవచ్చనీ తెలియజేస్తున్నది. శంకరాద్వైతాన్ని సగుణం చేసి, విశిష్టాద్వైతముగా నిరూపించిన రామానుజులకు కేవలం వేదభాష్య వేదాంత ప్రవక్తగానే కాక, వర్గ, వర్ణ విద్వేష రహిత సమాజ వ్యవస్థాపకులుగా కూడా జాతి చరిత్ర పుటలలో చెరగని స్థానం ఉంది.

కాని ఆ మహనీయుల సమరస భావం, సహన సౌశీల్యాలు మన సవగతమైనా చాలు. మనం కావల్సిన వాటిని వదలి పోవలసిన వాటికోసం పోట్లాడుకోం

యో నిత్య మచ్యుత పదామ్బుజయుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే,
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే.

# 8. వామనుడు

మన కుంటే మూడుపాళ్లు తింటాం, ముప్పైచోట్ల తిరుగుతాం, మూడంతస్తుల మేడలెక్కి మురిసిపోతాం దాంట్లో తప్పేమీ లేదు. కాని ఎదుటివాడిని మన ధనమదాలతో తూచాలనుకుండే మాత్రం మనం పాతాళంలో పడిపోక తప్పదు అందుకే అహంకార మంత ప్రమాదమైంది మరొకటి లేదంటుంది వామనావతారం

నిజానికి పుట్టుక రాక్షసజాతిలోనే అయినా అపరతేజ స్సంపన్నుడు, దైవీశక్తిపరుడు, మహాదానశీలుడు బలిచక్రవర్తి. తన బలంకన్న దైవబలం గొప్పదని నమ్మి తెలివిగా నడుచుకోగం రాజకీయ విజ్ఞాని ప్రహ్లాదుని మనుమడుగా, మహావిష్ణు పారమ్యాన్ని గ్రహించి ప్రస్తుతించే ఆధ్యాత్మిక విదుడు.

కాని దాతకు సాధారణంగా అహంకారవృపాలు అంతో ఇంతో ఎక్కువగానే ఉంటుంది బలికి కూడా అంతే

ప్రతి ప్రాణి పరమాత్మ ప్రతిరూపమని, అర్థిలోనూ అనంత పరిజ్ఞానం అణిగి ఉంటుందని వినయరహిత దాన శక్తితో దాన్ని కొలవాలనుకుంటే అది ప్రతిబుద్ధమై పరమేశ్వర స్వరూపాన్ని ప్రకటిస్తుందని మర్చిపోయి

"పసిబాలుండవు నేర నీ వడుగ నీ భాగ్యంబు లీ పాటిగా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ యల్పంబు నీ వేర్పునే"

అవగల్గాడు. అందువల్లనే వామనుడు ఏ మడుగుతాడో తెలుసుకోలేక, ఏ మడిగినా ఇస్తానని వాగ్దానం చేశాడు. నిజానికి ప్రతి దానమూ ప్రతి దాతా చేయదగ్గది కాదు. దాతకు కూడా పరిమితులున్నాయి. అది మరచి "దాత పెంపు సొంపు తలపవలదె" అని అహంకరించిన వ్యక్తిపైన పరమేశ్వర తత్త్వం దెబ్బతీస్తుంది అందుకే వామనుడు కూడ ఒకటి రెండడుగుల మేర ఇమ్మని, దాన పరిగ్రహణం కాగానే త్రివిక్రమ స్వరూపాన్ని దాల్చి భూనభోంతరాళాలు రెండు పాదాలతో వ్యాపించాడు. అర్థికే అవకాశమిస్తే ఆకాశమంత ఎదుగుతాడన్నమాట అప్పుడు ప్రతి దాత గతి బలి గతే. తీరని మూడో కోరిక తీర్చేందుకు పాతాళ ప్రవేశం తప్పదు.

అయితే ఇక్కడ త్రివిక్రముడైన వామనుడు బందీ అయిన బలికి ఎంతటి శిక్షనైనా విధించవచ్చు. కాని వ్యక్తిగా ఆమోదయోగ్యుడైనందువల్ల తన భక్తుని మనుమడైనందువల్ల అహంకారాన్ని శిక్షించి పాతాళంలోనే పరమభోగాలను ప్రసాదించడమే గాక సావర్ణి మనువు కాలంలో ఇంద్రపదవిని కూడా అనుగ్రహించాడు. అహంకారదూరుడైన బలి, అనంతునికి ప్రియ భక్తుడై సకలార్థాలూ పొందాడు. అంటే వినయశీలికి ప్రళయం కూడా ప్రమోదాంతమే అవుతుందన్నమాట అర్థులను అతి చులకనగా చూసే ప్రతి దాతకు బలివర్తన బలీయమైన మార్గదర్శక సూత్రం.

ఇంక దశావతార పరిణామదశలలో వామనావతారం మానవ మేధో వికాసానికి ప్రతిరూపం. మత్స్య, కూర్మ, వరాహ, నారసింహావతారాలు ప్రాణి పరివర్తన చరిత్రకు సాక్ష్యాలయితే, వామనావతారం పూర్ణమానవాకృతిలో విజ్ఞాన విన్యాసానికి ప్రాతిపదిక అయింది. యుక్తి, ప్రతియుక్తి లాంటి లౌకిక రాజకీయాలు ఇక్కడ నుండే ప్రారంభమైనవా అనిపిస్తుంది తరువాతి పరశురామ, రామకృష్ణావతారాలు ఆ లౌకిక విజ్ఞాన విన్యాస విశ్లేషణాలకూ మానవ ప్రగతి గీతకు ప్రతిధ్వని రూపాలే.

'పొట్టి వారికి పుట్టెడు బుద్ధులు' అన్న నానుడికి ఆధారం, ఆకారం వామనావతారమే

ఇలా చెప్పుకుంటూపోతే, పూర్వుల ప్రతి మాటా, ప్రతి బాటా మహాగ్రంథమే అవుతుంది అంతా ఒకేసారి తరచి మరచి ఒలకపోసుకునే కన్నా మనిషికి, మనసుకు వీలైనప్పుడల్లా మథించి మనసున కందినంత జ్ఞానసుధను సేవించటం మంచిది. అది సత్యం, నిత్యం, అనంతం.

నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్ర పాదాక్షి శిరోరుబాహవే,
సహస్ర నామ్నే పురుషాయ శాశ్వతే
సహస్ర కోటియుగధారిణే నమః.

* * *

# 9. ప్రహ్లాద - హిరణ్యకశిపులు

'ఉర్వారుకమివ బంధనాత్
మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్'

'తొడిమ వీడిన దోసపండు విధంగా మృత్యుబంధనం నుంచి తప్పించు, అమృతబంధనం నుంచి మాత్రం వద్దు' పారమార్థిక పరమావధికోసం చేసే ప్రార్థనను పరమలౌకిక జీవనాభ్యుదయానికి తపిస్తూ జపిస్తున్నాడు మానవుడు. నిజాని కీ ఆరాటం జీవి అవతరించినప్పటినుంచి ఉన్నదనే అనిపిస్తుంది. సామాన్య జీవాలు సాధారణ వస్తువులతోనే 'రక్షించు కొంటూంటే, అన్నిటికన్న ఆలోచనా పరుడు, ఆధ్యాత్మ విదుడూ ఐన మానవుడు, అధిష్ఠాన దైవాన్ని మెప్పించి, మృత్యువును తప్పించుకొనేందుకు ఎన్ని మార్గాలున్నవో వాటన్నిటికి అడ్డుగోడలుగా వరాలు గుప్పించుకున్నాడు

అడ్డులేనందువల్ల ఆదుపు తప్పి, ఊహాలోకాల్లో విహరిస్తూ ఈ జడేశ్వరుడు జగదీశ్వరుడుగా చాటుకున్నాడు.

కావి, బ్రతుకు బొమ్మలాటలో గాలి పోయుటం తీయటంలో ఆరితేరిన ఆటగానికి, ఈ కీలుబొమ్మల మాటలు, ఆటలు, నీతులు, కూతలు, వినటం ఆదో వేడుక అందుకే 'వాడెక్కడ' అని ఎగిరిపడేవాణ్ణి, ఆయాసం వచ్చేదాక ఆరవనీ అనుకొని దోబూచులాడుతుంటాడు మరొకప్రక్క తన విశ్వవ్యాపకతను, సర్వశక్తుడవనే సత్యాన్ని బంగ్యంతరంగా చూపిస్తుంటాడు కావి, తన ఆరువు బరువులన్నీ అసలు సొమ్ములనుకొనే 'మరబొమ్మ' 'మనిషి' అంతా తానేనని అహంకరించి, ఆదిపురుషుని అవమానించి, విశ్వ ధర్మాలపై విలయతాండవం చేసినప్పుడు తెరమరుగు సూత్రధారి తానొక పాత్ర దరించి ఆ ఆగడాల ఆటకు బరతవాక్యం, నవజీవన నాటకానికి నాంది పలుకుతాడు

ఒక రకంగా, నరసింహావతార కథ నరులకు చెప్పే దిదే!
"వీరాగార వివిష్ట పాంధుల క్రియన్ విక్కంబు సంసార సం
చారుల్ వత్తురు గూడి విత్తురు సదా సంగంబు లే దొక్కచో"

అనే జీవన తత్త్వాన్ని ఆకళించుకొని, అందరికీ చెప్పిన హిరణ్యకశి పుడు ఎన్నెన్ని మార్గాలలో మృత్యువు రా దగ్గదో అన్ని మార్గాల లోనూ చావులేకుండా వరాలు పొందీ, కంచుకోట కట్టుకున్నా ననుకొని తానే దైవాన్ని అన్నంతటి అహంకారాన్ని పెంచుకొని, హరిద్వేషిగా మారాడు కాని, లోకములన్నీ గడియలో జయించిన ఆతనికి, ఇంట శత్రువు లార్గు రున్నారని, వారిని జయిస్తే సాధ్యంకానిది లేదని కొడుకు ప్రహ్లాదుడు చెప్పినా పెడచెవిని పెట్టాడు ఎన్నివిధాల శిక్షించినా ప్రహ్లాదుడు చావలేదే అని కోపం వచ్చిందే కాని, విష్ణుమహిమలను, కప్పిస్తున్న వాటిని కూడా తెలిసికొనలేకపోయాడు మితిమించిన అహంకారంలో సత్యాన్వేషణ చేసి, తనలాంటి వాడికి సత్యం ఎంత భయంకరంగా, క్రూరంగా, తన విజ్ఞానానికి

ఆశీలంగా వుంటుందో తెలుసుకోగలిగాడు అందుకే సత్యస్వరూపుడైన నారా యణుడు హిరణ్యకశిపుడున్న రక్తకవచ వలయాన్ని కలితంగా నరహరిగా ఆవిర్భవించి ఆ జీవితానికి చరమవాక్యం పలికాడు

కాని పరతత్త్వావగాహన సం ప్రహ్లాదుడు 'నీ నరసింగాకృతి జూచి నే వెరువ' అంటూ ఆ బాహిర విదయంకర నరసింహ రూపం వెనుక ఉన్న దివ్య కరుణామయ తత్త్వాన్ని సందర్శించి తరించగలిగాడు దృష్టిభేదంలో ఉన్న అదృష్టభేదం అలాంటిది మరి

ఇక మనం అతి సగటు మానవులం ఆ తండ్రి ఔద్ధత్యం కాని ఈ కొడుకున్న తత్త్వదార్శనికత కాని మనకు లేవు బ్రతుకంటే భయం, చావంటే అసహ్యం గం మనం ప్రతిదినం పైకి క్రిందికీ తిరుగుతుంటాం పరిం పాడు కాకుండా, ఇహంలో ఇంతో అంతో సార్థక జీవనం గడపా లంటే ఆపదలలో ఆదుకొని చేయిచ్చి చేదుకొనే దేవుడు మనకోసం దిగి రావాల్సిందే అందుకే ఆయనను ప్రార్థిద్దాం

> సంసార యోగీ సకలేప్సిత నిత్యకర్మ
> సంప్రాప్య దుఃఖ సకలేంద్రియ మృత్యునాశ,
> సంకల్ప సిందుతనయా కుచకుంకుమాంక
> లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్.

* * *

# 10. దత్తాత్రేయ

ధర్మానికి ధిక్కారం అధర్మానికి అభ్యుత్థానం కల్గినప్పుడు తనను తానే అవతరింపచేసుకుంటానని భగవాముడు గీతలో సెలవిచ్చారు దుష్ట జన దర్పదళనానికి మత్స్య, వరాహ, నారసింహ, వామన, పరశురామ, కృష్ణా ద్యవతారములు, లోకహిత కార్యం కోసం కూర్మావతారాన్ని,

ధర్మబోధకోసం కపిల, ఋషభ బుద్ధాద్యవతారాలు ధరించటం జరిగింది. మహావిష్ణువుకు సంబంధించిన ఈ అవతార సామ్యమే హరావతారాలు శివలీలకు ఆమువు కల్పించినది నిజానికి శ్రీమన్నారాయణుడికి చతుర్విం శత్యవతారాలున్నాయని శాస్త్రవిదులు వక్కాణించారు

ఇవికాక దైవ వైవిధ్యం, ఏకత్వం సాధించుకొన్న రూపాలు కూడా మనకు కన్పిస్తున్నాయి శివకేశవాంశ సంభూతమైన ధర్మశాస్త (అయ్యప్ప), దత్తాత్రేయస్వామి ఈ కోవకు చెందినవి ఆ శబరిగిరీశుడు హరిహరసుతుడని ప్రసిద్ధి

ఇక మిగిలినది దత్తాత్రేయావతారం ఈ అవతార వర్ణనలోగాని, అర్చనలోగాని అతి విశేష ప్రాముఖ్యంగల విషయాలెన్నో వున్నాయి

అత్రి అనసూయలకు వరప్రసాదియైన దత్తాత్రేయుల సంభవం త్రిమూ ర్త్యంశరూపమని స్పష్టంగా తెలుస్తున్నదే ఆయన ఆయుధాలు కూడా అందు కనుగుణంగానే వున్నాయి ఆయన మహాజ్ఞాని, ఇహపరాలు ప్రసాదించే సర్వసమర్థుడనీ శాస్త్రాలు వర్ణించాయి

దత్తాత్రేయుని ఆకార విశేషాలలో కూడా మనకు అనేక సంకేతాలు కన్పిస్తాయి. దత్తాత్రేయావతార చిత్రణలో పవిత్రాతిపవిత్ర పావనాస్పదమైన గోమాతతో పాటు నిత్యం శునక చతుష్టయం పరివేష్టించివున్నట్లు కన్పిస్తుంది ఇవి నాలుగు వేదాలు ప్రతి రూపాలని విజ్ఞులు అంటారు అంటే అవి అనంత విజ్ఞానానికి అభేసరూపాలన్నమాట సత్యదర్శనం కోరే మానవుడు బాహిర సౌందర్యంకన్న ఆత్మసౌందర్యానికే ప్రాధాన్యం ఇచ్చి నిగ్రహంతో శ్రమిస్తే తప్ప సత్యదర్శనం కాదు ఇది ఆచరణలో గురుపరీక్ష అన్నమాట.

దత్తాత్రేయులవారు సాధారణంగా బ్రహ్మచారి అన్న భావన మనకు కలుగుతుంది కాని దత్తాత్రేయ పూర్వమాలలో మధుమతీ సహిత దత్తాత్రేయస్వామిగా వర్ణించారు నిజానికి దత్తాత్రేయాష్టోత్తర శతనామ స్తోత్రం ఆయనను బ్రహ్మ, విష్ణు, శివాత్మకుడని, నానారూపధరుడని

వర్ణించింది ఆయన సంగీతప్రియుతను గురించి నాదబ్రహ్మైక నిష్ఠుడని మృదంగ రవరసికుడని వర్ణించబడింది

దత్తాత్రేయ వజ్రకవచంలో ఈ కవచాన్ని ఎన్ని సార్లు జపిస్తే ఏ యే ఫలాలో, ఐహికాముష్మిక వివరణలతో వుంది ఇక అనుష్ఠాన విషయంలో "నిద్రాభిక్షే స్నాన శౌచే, నేచ్ఛామి న కరోమిచ, ద్రష్టారశ్చే త్కల్పయన్తు, కిం మే స్యా దన్యకల్పనాత్" అని, నిద్రాన్న భిక్షాస్నాన శౌచాదులు ప్రధానమైనవి కావని అయినా, లోకసంగ్రహం, అనుష్ఠానవిధులు అన్యులకోసం కల్పించాలని దత్తాత్రేయులే సెలవిచ్చినట్లు అవధూతోపనిషత్తులో వుంది అంటే శ్రద్ధారహిత బాహ్యాడంబరం కన్న శ్రద్ధాభరితానుష్ఠానమే సత్ఫలదం అన్నమాట బాహిరశుద్ధి కన్న అంతశ్శుద్ధి ఆవశ్యకం అని తాత్పర్యం

అత్ర్యనసూయాసుతుడు దత్తాత్రేయుడు సర్వదేవతా స్వరూపుడన టానికి ఇంకొక ఉదాహరణ దత్తాత్రేయార్చనా విధానంలో కనిపిస్తుంది అన్ని పూజావిధానాలకన్న భిన్నంగా "సహస్రశీర్షా పురుషః" అన్న నారాయణ సూక్తంతోపాటు శ్రీసూక్త సంపుటీకరణం కూడా నిర్వహించబడింది

దత్తాత్రేయు డంతటి సర్వదేవతాస్వరూపుడు కనుకనే ఆయన అర్చన అవధూత, నాథసంప్రదాయావిష్కరణకు ఆలంబనమైంది

ఏది ఏమైనా దత్తాత్రేయమహర్షి లేదా మహాశక్తి అర్చావిధానము సాత్త్వికజ్ఞాన సాధనైకగమ్యాలు

ఇలా సర్వ జీవముద్ధరణైక మంత్ర ద్రష్ట లెందరో వున్నారు ఇహంలో జనసేవలో ఇష్టుడుగా బ్రతికి, చరమ పరమపదాన్ని చేరాలని బోధించే ఆ మహాత్ములలో కొందరికైనా ఒక కోటి దణ్ణాలు పెట్టుకుందాం

పీతాంబరాలంకృత పృష్ఠభాగం భస్మావకుంఠామల రుక్మదేహమ్,
విద్యుత్సదాభా పింగ జటాభిరామం శ్రీదత్తయోగీశ మహం భజామి.

* * *

# 11. హరిహర రూపం

దేహి-దేహం-ఒకటా రెండా? ఈ చర్చ అనాదిగా వస్తూన్నదే. ఆధ్యాత్మవిదులైన వాళ్ళు దేహంలో ఉన్నా, ఇంటాయన ఇంటికి వేరైనట్లే, వేరే వేరేనని అన్నారు. అతివాస్తవికవాదులు దేహి దేహం ఒకటే అవి దైహిక పరిణామ దశలఫలంగా ఈ దేహగేహం పనికిరానిదై పోతుందని, ఆ జీర్ణ శీర్ణ స్థితినే మన మామూలు భాషలో మృత్యువంటారనీ వాదిస్తూ వచ్చారు. కాని, చరాచర జగత్తులో వస్తుతత్త్వ ప్రతిబాపకమైన ఒక కళ అనేది ఉందనీ, ఆ కళనే జీవం అంటారనీ, అది అంతర్నిహితంగా వుండి ఆడిస్తున్నంతవరకు శివము శివకరము శివతరమూ అయింది, ఆ కళా రహితమైనప్పుడు జడమై, శివేతరంగా మారి దూళిలో కలుస్తున్నదన్నది గుర్తిస్తే ఇల్లూ, ఇంటాయన ఒకటనుకోవటం కష్టం. ఇలా యీ జీవతత్త్వం వస్త్వేతరంగా విశ్వవ్యాప్తమై ఉన్నందువల్లనే, ఆ సర్వాతర్యామిత్వాన్ని శివపరంగా కేశవపరంగా అన్వయిస్తూ ఆరాధన చేసేవారు దేహాతిరిక్తమైన శుద్ధచైతన్యం ఒకటేనని, ఉపాధిభేదం వల్ల వస్తుబాహుళ్యంగా ఆబాపిస్తున్నదని భావించారు. అందువల్లనే హరిహరతత్త్వాలలో దేన్ని సంభావించినా, సర్వ వ్యాపక చైతన్యస్వారోపణ వల్ల ఆధ్యాత్మిక సందేశాన్ని, లౌకిక వ్యవస్థకుగామ సమతాధర్మాన్ని ప్రవచించి ప్రవహింపజేశారు

యజుర్వేదీయ శతరుద్రీయంలోని నమకభాగంలో, చరాచర విశ్వంలోని వివిధ ధర్మాలతో కర్మలతో ప్రాతినిధ్యం వహించే దేవతారూప పరతత్త్వ ప్రణామంతోపాటు, విశాలసృష్టిలోని జీవజాలం అంతటిపట్ల గౌరవ ప్రకటనం కన్పిస్తుంది. ఇక చమకబాగంలోని మంత్రాలు చలాచల వస్తు ధర్మాలన్నీ తనలో ఆధ్యారోపితం కావాలన్న కాంక్షను ప్రతిబింబిస్తాయి అంటే లౌకికంగా స్వసుఖంతో పాటు పరహితకామన మంత్రభాగాల ముండేతి కంకణం

అలాగే మహావిష్ణు పారమ్యాన్ని బోధించే విష్ణు సహస్రనామంలో పరమాత్ముని అనంతమూర్తిమత్త్వం గోచరమౌతుంది బగవద్గీతలో పురు

షోత్తముడు సర్వకళామయ విశ్వంలో స్వకళాప్రకాశం ఎక్కడెక్కడ వుందో ప్రస్ఫుటం చేశారు

పరహితంకోసం పాటుపడుతూ నిగ్రహమే విగ్రహమైన వీతరాగికి, కైవల్యం కరతలామలకం లాంటిదని "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ" వంటి శ్లోకాలు విరూపిస్తాయి.

విజావికి మన భావనల అవగాహనలన్నీ ఒకే పరతత్త్వాని కున్న బహు ముఖ సమారాధనమే పరశివుడు సాకారంగా బోధించింది, పురుషోత్తముడు గీతగా ప్రవచించింది కూడా యిదే

అదే బ్రహ్మ, అదే శివుడు, అదే విష్ణువు, ఇంద్రుడు అక్షరున అక్షరమైన పరమస్వరూపం కూడా ఆ శాశ్వతసత్యమే.

అందుకే పురుషోత్తమ ప్రతిపాదితమైన శివధర్మాన్ని శివరాత్రి మహా పర్వదినంలో ఇలా పాడుకొందాం

తాళ్ శడై యుమ్ నీళ్ ముడియుమ్ ఒణ్ మళువుమ్ శక్కరముమ్
శూళురవుమ్ పొన్నాణుమ్ తోన్రుమాల్ - శూళుమ్,
తిరుణ్ణరువి పాయుమ్ తిరుమలై మేలెన్దైక్కు,
ఇరణ్డురువు మొన్నాయిశైన్దు.

- శ్రీ పేయాళ్వార్

పొడవైన కేశపాశములతోడి జడ, శ్రీహస్తములో చక్రాయుధము, నాగాభరణము, బంగరు మొలత్రాడులో కూడి శ్రీవేంకటేశ్వరస్వామివారు హరిహరరూపముగా దర్శనమిచ్చుచున్నారు శ్రీస్వామివారు వెలసిన ప్రదేశము అనేక జలపాతములతో విలసిల్లు తిరుమల దివ్యక్షేత్రము శ్రీవారు ఇట్లు హరిహరస్వరూపులై దర్శనమిచ్చుచున్నారు

* * *

